# అందరికీ నచ్చిన [illegible]

[సాంఘిక హాస్య నాటిక]







రచన :

**పి. దుర్గారావు,** ఎం.ఓ.యల్.

1979
సిద్ధార్థనామ సంవత్సరము
వసంతము - వైశాఖము.

ప్రథమ ముద్రణము :
1000 కాపీలు.

మూల్యము :
రెండు రూపాయలు.



ముద్రణ :
'వెంకటరత్న', విజయవాడ.

---

ప్రతులకు :
**పి. దుర్గారావు**, యం.ఓ.యల్.,
చెరుకుపల్లి పోష్టు,
(వయా) నక్రేకల్,
నల్లగొండ తాలూకా, నల్లగొండ జిల్లా.

## సమర్పణ:

పల్లెసీమలలో నివసించి

బీదప్రజానీకానికి వైద్య సహాయాన్ని అందజేస్తూ

సంఘ సేవ చేస్తున్న

**డాక్టర్లకు**

హృదయపూర్వకముగా.



# వినయ వాక్యము

'అందరికీ నచ్చిన కోడలు' అను రెండు రంగముల నాటిక విద్యార్థులను దృష్టిలో నుంచుకొని వ్రాయబడినది. ఈ నాటికను నల్లగొండ జిల్లా, మిర్యాలగూడ తాలూకా, రావులపెంట జిల్లా పరిషదున్నత పాఠశాల విద్యార్థినులు గత సంవత్సరము స్వాతంత్ర్యదినోత్సవ సందర్భములో ప్రదర్శించిరి. ప్రేక్షకులచే ప్రశంసింపబడి ప్రథమ బహుమతినందిరి. ఈనాటిక యందు హాస్యరసముతో బాటు సేవాభావము, సంఘసేవ ఆదర్శముగా స్వీకరింపబడినది.

'హృదయం వున్న మనుష్యులు' అను ఏకాంకనాటికను గూడ ఇందు జేర్చితిని. ఈనాటికగూడ విద్యార్థులు ప్రదర్శించుటకు వీలుగా నుండునని భావించుచున్నాను.

ఈనాటికలను విద్యార్థులు స్వేచ్ఛగా ప్రదర్శింపవచ్చును. ఇతరులు రచయిత అనుమతితో ప్రదర్శింపవలెను. రసహృదయులు ఈనాటికలను జూచిగాని, చదివిగాని ఏమాత్రము ఆనందించినను నాయత్నము సఫలమయిందని భావింతును.

— రచయిత

---

అందరికీ నచ్చిన కోడలు

ఇందలి పాత్రలు;

1. రామనాథం [రవీంద్రుని తండ్రి]
2. జానకమ్మ [రామనాథంగారి భార్య]
3. రవీంద్ర [రామనాథంగారికుమారుడు]
4. సరోజిని [రవీంద్రతో యం.బి.బి.యస్. చదువుతున్న విద్యార్థిని]
5. రాముడు [ఒక హరిజన కూలి యువకుడు]

# అందరికీ నచ్చిన కోడలు

## మొదటి రంగము

[రామనాథంగారి యిల్లు. రామనాథంగారు కుర్చీలో కూర్చుని యుండును]

(తెర యెత్తబడును)

రామనాథం : ఇదిగో! జానకం! ఓ జానకం!

జానకమ్మ : (లోపలనుండి) ఎందుకండీ అలా ఉండుండి పిలుస్తారు? వంట చేయనిస్తారా లేదా? ఎందుకూ?

రామ: నీ మాట నీదే గానీ యింకొకళ్ళమాట వినిపించుకోవు గదా? ఒకమాటు యిలారా.

(జానకమ్మ ప్రవేశించును)

జాన : రాక రాక యిన్నాళ్ళకు అబ్బాయి వచ్చాడుగదాయని నేతిగారెలు చేస్తుంటే యెందుకండీ అట్లా పిలుస్తారు?

రామ: నేతిగారెలు యెవరికి కావాలి? మరి తీపి వస్తువు యేం చేశావు?

జాన : అబ్బాయికి నేతిగారెలంటే చాలాయిష్టం. మీ కోసం రవ్వలడ్డు చేశాలెండి.

రామ: వంటపని వంటలక్క చూసుకుంటుంది గాని సీతతో కొద్దిగా మాట్లాడాలి.

జాన : మీకెప్పుడూ ముచ్చట్లు కావాలి. చెప్పండి అదేమిటో.

రామ: సరేగాని ఈ రోజు ఏమిరోజో తెలుసా?

జాన : ఏ రోజు?

రామ: మన వివాహంజరిగినరోజు! మా ఖుశుకస్థ ప్రేమి. జ్ఞాపకం తెచ్చుకో జానకీ! ఆ నాటి సంగతులన్నీ...

జాన : చాల్లెండి! ఇప్పుడా సంగతులన్నీ యెందుకు?

రామ: నీ మంగళసీమలో మాంగల్యాన్ని కట్టి తలమీద తల బ్రాలు పోస్తూవుంటే నీ వెలా సిగ్గుపడింది - తలవంచు కున్నదీ జ్ఞాపకంవుందా జానకీ?

జాన : చాల్లెండి, మీకు పిచ్చి ముదురుతోంది!

రామ: ఇంతకూ వంట పూర్తయిందా?

జాన : అంతా సిద్ధం. గారెలుమాత్రం కాలేదు. వంటలక్క చేస్తోంది. అబ్బాయి రాగానే భోంచేద్దాం.

రామ: అబ్బాయి యేడీ? యెక్కడికి వెళ్ళాడు?

జాన : ఎక్కడికి వెళ్తాడు? ఊళ్ళోవున్న స్నేహితుల్ని చూడ డానికి వెళ్ళివుంటాడు! అబ్బాయిచదువు ఇంకెన్నాళ్ళకు పూర్తవుతుందండీ?

రామ: ఒక సంవత్సరంలో యం.బి.బి.యస్. పూర్తవుతుంది.

జాన : యం.బి.బి.యస్, అంటే ఏమిటండీ?

రామ: డాక్టరుపరీక్షే డాక్టరు పరీక్ష! ఒక సంవత్సరంలో మన

బ్బాయి డాక్టరవుతాడు. నెలకు వెయ్యిరూపాయలు సంపాదిస్తాడు. నా కొడుకంటే ఏమనుకున్నావు? డాక్టర్! డాక్టర్!

జాన : నా కొడుకుమాత్రం కాదాయేమిటి? రానీండి! అబ్బాయిని అడుగుతా.

రామ: ఓసి తెలివితక్కువా! లోకం వాడిని రామనాథంగారి అబ్బాయంటుందిగాని జానకమ్మ కొడుకంటుందటే?

జాన : చాల్లెండి మీ సంబరం.

రామ: సరేగాని అబ్బాయి పెళ్ళిమాట యేం చెబుతావ్?

జాన : మీ ఇష్టమండీ! ఆ విషయం నన్నడగకండీ! అయినా నాయిష్ట మేముంది యీయింట్లో?

రామ: నీయిష్టంగాక నాయిష్టం సాగుతున్నదటే యీఇంట్లో? నా మాట యెప్పుడైనా ఒప్పుకున్నావా?

జాన : మీరుమాత్రం ఒప్పుకున్నారా నా మాట?

రామ: నీ మాట యే మాట ఒప్పుకోలేదో చెప్పు!

జాన : సలక్షణమైన మా తమ్ముడి కూతుర్ని మనబ్బాయికి ఇచ్చి పెళ్ళిచేద్దామంటే మీరు ఒప్పుకున్నారా?

రామ: ఎందుకే ఆ దౌర్భాగ్యపు చుట్టరికం?

జాన : చూశారా! చూశారా! ఎంతమాటన్నారు! మాది దౌర్భాగ్యపు చుట్టరికమా?

రామ: అవును ముమ్మాటికి!

జాన : మఱి నన్నెందుకు చేసుకున్నారు?

రామ: ఖర్మ కాలబట్టి! నాకేం కట్నంయిచ్చారు మీ వాళ్ళు?

జాన : మీకు కట్నంకూడా యివ్వాలి? అదివరకు మీకేము న్నది? మీ బీదతనాన్ని జూచి మీ మేనమామలు మీకు పిల్లనివ్వకపోతే గతిలేక నన్ను జేసుకున్నారు. మీ ఇంట్లో నేను అడుగు పెట్టబట్టే మీ కింత సిరి సంపదలొచ్చినయి. నేను వచ్చినతరువాత నేకదా పదెక రాల చెరువుక్రిందపొలం, ముప్ఫయియెకరాల రేగడి, పదియెకరాల చెరుకుతోట కొన్నది. అదివరకు మీకే ముంది? ఒక్కొక్క మెతుకును యేరుకుతినేవాళ్ళు.

రామ: ఏమైనాసరే మీ పుట్టింటిసంబంధం నాకిష్టంలేదు. మీ తమ్ముడి కూతురు వట్టికందిరీగ. అందమా? చందమా? పాటా? పద్యమా? ఇంగ్లీషుయేమన్నా చదువుకున్నదా అంటే అదీలేదు.

జాన : ఇంగ్లీషు చదువు చదువుకోకపోతే ఏమండీ? అందాల భరిణ! కుందనాల కుప్ప! చిదిమిన దీపం! మీ కళ్ళకు అందాన్నిచూచే తెలివి వుండాలని!

రామ: నీ కళ్ళకు వుందిలే మహా! అది అవిటిపిల్ల!

జాన : అవిటిదెందుకవుతుందండీ, చిన్నప్పుడేదో జబ్బుపడి కొద్దిగా కాలు వంకరపోయింది. ఇప్పుడంతా చక్క బడింది.

రామ: ఇంతకూ ఉన్న నా ఒక్కకొడుకు మొహకు నీ తమ్ముడి కూతుర్ని ఆ అవిటిపిల్లను అంటగట్టాలని చూస్తున్నా వన్నమాట, అంతేనా?

జాన : కట్నానికాశపడి కానిపిల్లను నా కొడుకుమొహకు అంట గట్టి వాడి జీవితం నరకం చేయాలనుకుంటున్నారు! అంతేనా?

రామ: కానిపిల్ల ఎందుకయిందే, రత్నంలాంటి పిల్ల! రామ చిలుక! లక్షాధికారి కూతురు! చిన్ననాటి నా స్నేహితుని ఏకైక పుత్రిక! యాభై వేలు కట్నం, హైదరాబాదులో వున్న ఇల్లు వాళ్ళమ్మాయికి అరణంగా ఇస్తారట! చిన్నకారు కొనిపెడతారట! ఇంగ్లీషు చదువుకుంది. ఈడూ జోడూ బావుంటుంది!

జాన ; బస్తీపిల్లను పెళ్ళిచేస్తే ఆవిడగారు మనమాట వింటుందంటారా? అందులోను శ్రీమంతుల పిల్ల !

రామ; ఎందుకు వినదే నీ నోరు మంచిదయితే?

జాన ; అయితే నా నోరు మంచిదికాదన్న మాట!

రామ; ఆ మాట నేనన్నానా?

జాన ; ఏమో మీయిష్టం, వాడియిష్టం. నేనెందుకు మీతండ్రీ కొడుకుల మధ్య?

రామ; నేను తెచ్చిన హైదరాబాదు సంబంధాన్ని అబ్బాయి ఒప్పుకునేటట్లు నీవుకూడా చేయాలి!

జాన ; ఎందుకనీ?

రామ: నీమాట మీద వాడికి మిక్కిలి గౌరవం! అందుకని!

జాన : అయితే నన్నేం చేయమంటారు?

రామ: మీ నాన్నగారు తెచ్చిన సంబంధాన్ని ఒప్పుకోరా నాయనా అని చెప్పాలి. వాణ్ణి ఒప్పించాలి.

జాన : అదేం కుదరదు. నా తమ్ముడి కూతురు శ్యామలను పెళ్ళి చేసుకోరా నాయనా అని చెబుతా!

జాన : ఇలా చెప్పడానికి మీకూకూడ హక్కులేదు.

రామ: ఈయిల్లు నాయిల్లు. వాడు నాకొడుకు. నీవు నాభార్యవు. నేను చెప్పినట్లు ఈయింట్లో అందఱూ నడవాల్సిందే!

జాన : అదేం సాగదండోయ్! అదేం సాగదు! ఈ యింటికి నేను ఇల్లాలును వాడు నా కొడుకు. నువ్వు కట్టుకున్న భర్తవు. నేను చెప్పినట్లు ఈఇంట్లో జరగాల్సిందే!

రామ: అదేం కుదరదు.

జాన : మీరు చెప్పేది అంతకంటే కుదరదు.

రామ: మరేం చేద్దామే?

జాన : ఇందుకు ఒకటేదారి!

రామ: అదేమిటి?

జాన : అబ్బాయితో మీరు చెప్పుకునేది మీరు చెప్పుకోండి! నేను చెప్పుకునేది నేను చెప్పుకుంటాను! అబ్బాయి యిష్టం!

రామ: అయితే మరి అబ్బాయిని బలవంతం చేయకూడదు!

జాన : మరి మీరుకూడ చేయకూడదు!

రామ: అల్లాగేనే! అల్లాగే!

జాన : ఒకరివిషయంలో ఒకరు జోక్యం కలుగజేసుకోకూడదు సుమా!

రామ: అల్లాగేనే బాబూ! అల్లాగే! ఆడవాళ్ళు పెత్తనంచేసే రోజులొచ్చిపడ్డాయి! ఏం చేస్తాం? మగవాళ్ళ ఖర్మ! అడుగో మాటల్లోనే అబ్బాయి వస్తున్నాడు.

(రవీంద్ర ప్రవేశించును)

జాన : నీకు నిండానూ రేళ్ళొయిష్యంరా రవీ! నీమాటే తలుచు కుంటున్నాం.

రామ: ఇంతసేపు యెక్కడికి వెళ్ళావురా రవీ?

రవి : ఎక్కడికి వెళ్ళలేదు నాన్నా! మనతోటలో నేను చిన్నప్పుడు నాటిన గున్న మామిడి చెట్టును చూడ్డానికి వెళ్ళాను నాన్నా!

జాన : మనబ్బాయికి ఆ గున్న మామిడి చెట్టంటే ప్రాణం!

రామ: ఆ గున్న మామిడి చెట్టు ప్రక్కన ఒక మూలతెలతను కూడా పెంచకపోయావా రవీ!

రవి : పట్నంనుండి నేను వచ్చేటప్పుడు మాలతీలతను తీసుకొచ్చాను. ఆగున్న మామిడిచెట్టు ప్రక్కన నాటివస్తున్నాను నాన్నా!

రామ: మంచిది. ఇంక భోజనానికి లేద్దామా రవీ?

రవి : [గడియారం చూచి] ఇప్పుడు పదిన్నరగంటలే కదా నాన్నా అయింది! ఒకస్నేహితుణ్ణి భోజనానికి రమ్మని పిలిచాను. మీరేం భోంచేయండి నాన్నా! ఆ స్నేహితుడు వచ్చిన తరువాత మేమిద్దఱం భోంచేస్తాం!

రామ: ఆస్నేహితుడెవరో రానీ! అందఱం కలిసే ఒకసారే భోంచేద్దాం! సరేగాని రవీ! నీ చదువు ఇంకెన్నాళ్ళకు పూర్తవుతుందిరా?

రవి : ఒక సంవత్సరంలో పూర్తవుతుంది నాన్నా!

రామ: నీ చదువు సంగతి అట్లావుంచు. నిన్నొక విషయం అడుగుదామని అనుకుంటున్నాం. మా మాట ఒప్పుకుంటావా?

రవి : ఏం మాట నాన్నా?

రామ: అదే నీ పెళ్ళి విషయంరా. నీకు పెళ్ళయితే చూచి సంతో షించాలని వుందిరా మాకు.

జాన : అవునురా నాయనా.

రవి : అట్లాగే నాన్నా! మీ మాట నెప్పుడయినా కాదన్నానా నాన్నా! ఈ సంవత్సరంతో నా చదువు పూర్తవుతుంది. చదువు పూర్తయ్యాక చేసుకోకూడదా నాన్నా?

రామ: అది కాదురా రవీ! మేము పెద్దవాళ్ళ మయిపోయాం! ఎప్పుడు రాలిపోతామో తెలియదు! నీ కాస్త మూడు ముళ్లూ పడిపోతే నిశ్చింతగా కాలం గడిపాలని అనుకుంటున్నాం!

జాన : అవునురా నాయనా! మీ నాన్నగారు చెబుతున్నది అక్షరాల నిజం!

రామ: అంతే కాదురా! అవతల నా స్నేహితుడు తొందర పడుతున్నాడు. ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాస్తున్నాడు. నిక్షేపంలాంటి సంబంధం! యాభై వేలు కట్నం. చిన్న కారు. హైదరాబాదులో వున్న భవనం అరణం.

రవి : ఎవరు నాన్నా మీ హైదరాబాదు స్నేహితుడు?

రామ: పటికం సూర్య సుందరంగారు. హైదరాబాదులో గొప్ప మందుల వ్యాపారస్థుడు.

రవి : అతడా నాన్నా. అతడీ మధ్య బ్లాకు మార్కెట్టులో మందులవ్యాపారం చేసినందుకు ప్రభుత్వం నిర్బంధించినట్లు పేపరులో చదివాను నాన్నా! నాకొద్దు?

రామ: ఆ! గిట్టని పత్రికల వాళ్ళెవరో వ్రాసివుంటారు.అయినా యీరోజుల్లో బ్లాకుమార్కెట్టు చేయని వాళ్ళెవ్వరా?

రవి : అదేమిటి నాన్నా! అటువంటి అవినీతి పనులతో మన కెందుకా సంబంధం?

జాన :. చక్కగా చెప్పావురా నాయనా!

రామ: జానకీ! నీవు అనవసరంగా జోక్యం గలిగించుకుంటు న్నావు! నువ్వూరుకో!

జాన : అట్లాగేనండీ!

రామ: ఒకేయ్ రవీ! పిల్లచక్కని చుక్కరా!

రవి : చుక్కయితేనేం? చంద్రుడయితేనేం నాన్నా. అటు వంటి అవినీతి పనులసొమ్ము మనకెందుకు?

జాన ; అలా మీ నాన్నగారికి చెప్పరా నాయనా. నాకొడుకు వనిపించుకున్నావు.

రామ; జానకీ! నువ్వూరుకో!

జాన ; అట్లాగేనండి!

రామ; అయితేరవీ! నేను తెచ్చిన సంబంధం నువ్వు చేసుకో వన్నమాట. అంతేగా!

రవి ; అదికాదు నాన్నా! నేను మీయిద్దరి యిష్టంకోసం యేపనయినా చేస్తాను నాన్నా! అమ్మా! నీకీ సంబంధం ఇష్టమేనా?

జాన ; నాకిష్టంలేదురా నాయనా!

రామ; మీయమ్మ యిష్టంతో నీ కేంపనిరా. నీయిష్టం చెప్పరా.

రవి ; నేను ముందే చెప్పానుగదా నాన్నా. మీ యిద్దరి యిష్టంతో యేపనైనా చేస్తానని.

రామనాథం : మీ అమ్మమాట కేంగాని నేను తెచ్చిన సంబంధాన్ని ఒప్పుకో.

రవీంద్ర : అమ్మకూడ ఒప్పుకోవాలి నాన్నా! అమ్మా! చెప్పు! నీకీ సంబంధం యిష్టమేనా?

జానకమ్మ : సుతరాము నా కిష్టం లేదురా! ముక్కు, ముఖం తెలియని ఆ పట్నం పిల్ల మనకెందుకురా? సలక్షణంగా మీ మేనమామ కూతురుండగా!

రవీంద్ర : అమ్మా! మామయ్య కూతురు శ్యామలనా?

రామనాథం : అదేరా! చిన్నప్పుడు స్ఫోటకంపడి కాలు అవిటి అయిందే- ఆ పిల్లనుదెచ్చి నీ మెడకు అంటగట్టాలనుకుంటుందిరా మీ అమ్మ!

జానకమ్మ : మీ నాన్న మాటలకేమిరా! నువ్వెళ్ళి ఒక్కసారి మామయ్య కూతుర్ని చూసిరా! ఎంత అందంగా వుంటుందో!

రామనాథం : పగలుచూస్తే రాత్రి కలలోకొస్తుంది!

జానకమ్మ : ఏమండీ! మీరు అనవసరంగా జోక్యం కలిగించుకుంటున్నారు!

రామనాథం : నా కొడుకు విషయంలో జోక్యం కలిగించుకోకపోతే ఇంకెవరి విషయంలో జోక్యం కలిగించుకుంటానే?

జానకమ్మ : నా కొడుక్కి నా యిష్టమయిన కోడల్ని యేరి తెచ్చుకుంటాను! మీ రెవరు అడ్డు చెప్పడానికి?

రామనాథం : ఇది నా యిల్లు! ఈ యింట్లో నాయిష్ట ప్రకారం జరిగి తీరవలసిందే!

జానకమ్మ : నేను ఈ యింటికి యిల్లాలును! ఈ యింట్లో నా యిష్టప్రకారం జరిగి తీరవలసిందే!

రవీంద్ర : అబ్బబ్బబ్బ! ఏమిటీ గోల నాన్నా? ఏమిటీ గోల అమ్మా!

రామనాథం : ఒరేరవీ! తేల్చి చెప్పరా! నేను తెచ్చిన పట్నం పిల్ల సంబంధం యిష్టమో! లేకపోతే మీయమ్మ చెప్పిన కుంటి మేన మరదలి సంబంధం యిష్టమో!

జానకమ్మ: ఒరే! నాయనా! తేల్చి చెప్పరా! సలక్షణమైన మేనరికం యిష్టమో! లేకపోతే బస్తీలో పెరిగిన ఆ బడాయి పిల్ల సంబంధం యిష్టమో.

రవీంద్ర : నాన్నా చెప్పమంటావా?

రామనాథం: చెప్పరా బాబూ? చెప్పు.

రవీంద్ర : చెప్పమంటావా అమ్మా?

జానకమ్మ : చెప్పరా నాయనా చెప్పు.

రవీంద్ర : మీ రిద్దరు ఒక అంగీకారానికి వచ్చి, ఆ యిద్దరిలో ఒకమ్మాయిని పెళ్ళి చెయ్యండి. అదే నా యిష్టం.

రామనాథం : మీ అమ్మ ఒప్పుకోదురా!

జానకమ్మ : మీ నాన్న ఒప్పుకోరురా.

రామనాథం : (జానకమ్మతో) నేను చెప్పినట్లు ఒప్పుకోవే. నీ గడ్డం పుచ్చుకుంటాను. నా పరువు నిలపవే.

జానకమ్మ : ఏమండీ! నేను చెప్పినట్లు ఒప్పుకోండి. మీ కాళ్లు పట్టుకుంటాను. నా పుట్టింటి పరువు నిలపండి.

రామనాథం : అలా వీలు లేదు.

జానకమ్మ : మీరు చెప్పేది అంతకంటే వీలులేదు.

రామనాథం : (రవీంద్రతో) మీఅమ్మ ఒప్పుకోవడం లేదురా.

జానకమ్మ : (రవీంద్రతో) మీ నాన్న ఒప్పుకోవడం లేదురా

రవీంద్ర : (ఇద్దరితో) అయితే నన్నేం చేయమంటారు?

రామనాథం : నేను చెప్పినట్లు నడుచుకోరా బాబూ.

జానకమ్మ : నేను చెప్పినట్లు నడుచుకోరా నాయనా.

రవీంద్ర : అయితే మీరు ఒక అంగీకారానికి రాలేరన్నమాట

రామనాథం : రాలేమురా.

జానకమ్మ : రాలేమురా.

రవీంద్ర : (రామనాథంతో) అయితే నా మాట వింటారా నాన్నా?

రామనాథం : చెప్పు అదేమిటో వింటాం.

రవీంద్ర : చెప్పనా అమ్మా?

జానకమ్మ : చెప్పరా బాబూ.

రవీంద్ర : నేనొక అమ్మాయిని... ఒక... అమ్మాయిని...

రామనాథం : ఒకమ్మాయిని? ఒకమ్మాయిని ఏం చేసావు?

రవీంద్ర : మీ యిష్టమయితే...

రామనాథం : అయితే?

రవీంద్ర ; పెళ్ళి చేసుకోదలుచుకున్నాను నాన్నా?

రామనాథం ; (జానకమ్మతో) ఒసేవ్ జానకీ ఇంకేముంది? కొంపలంటుకున్నాయ్.

జానకమ్మ ; ఎవరి కొంపలండీ?

రామనాథం ; ఎవరికొంపలేమిటి? మన కొంపలేనే. మనబ్బాయి ఎవరో అమ్మాయిని ప్రేమించాడట. పెళ్ళి చేసుకుంటాడట?

జానకమ్మ ; ఎంతపని చేశావురా నాయనా?

రవీంద్ర ; నేనేం చేశానమ్మా?

రామనాథం : ఇంకేం చేయాలి? మా యిష్టంలేకుండానే యెవరినో ప్రేమించేశావు. పెళ్ళి చేసుకుంటానంటున్నావు. నా స్నేహితునికి నే నెలా ముఖం చూపించను?

జానకమ్మ ; మీ మామయ్యకు నే నెలా ముఖం చూపించను? పుట్టింటి వారింకా నన్ను గుమ్మం తొక్కనిస్తారా?

రామనాథం ; (రవీంద్రతో) ఎవరురా ఆ అమ్మాయి?

రవీంద్ర ; నాతోబాటు యం. బి.బి. యస్. ఆరో సంవత్సరం చదువుతోంది నాన్నా.

రామనాథం . అయితే యిద్దరూ డాక్టర్లన్నమాట.

రవీంద్ర ; అవును నాన్నా, ఇద్దరం డాక్టర్లమయి ఉద్యోగాల్ని ఆశించకుండ, గ్రామాల్లో నివసించి, బీదప్రజానీకానికి సేవచేయ దలుచుకున్నాం నాన్నా.

రామనాథం; అయితే యిద్దరూ ఉద్యోగాలుచేసి డబ్బు సంపా
దించరన్నమాట.

రవీంద్ర : ప్రస్తుతం మనకున్న ఆస్తి చాలదానాన్నా? మన
మనదేశంలో చాలినంత వైద్య సౌకర్యంలేక ఎంతో
మందిబీద ప్రజానీకం మృత్యువాత బడుతున్నారు.
ఆ అభాగ్యులకు మేము గ్రామాలలో నివసించి సేవ
చేయ దలుచుకున్నాం నాన్నా.

రామ: ఆశయాలు మంచివేగాని ఆచరణలో జరగొద్దూ?

రవి : ఆచరణలో జరగాలనే మా ఉద్దేశం నాన్నా!

రామ: ఒరే రవీ! నువ్వు పెళ్ళి చేసుకో దలుచుకున్న ఆ
అమ్మాయి కులగోత్రా లేమిటో తెలుసుకున్నావా?

రవి : ఆ అమ్మాయి ఇప్పుడే వస్తుంది నాన్నా! విచారించి
మీరే తెలుసుకోండి ఆ కులగోత్రాలను! ఆ అమ్మా
యిని మీకు పరిచయంచేసి, మా వివాహానికి మీ అను
మతి పొందటం కోసం ఆఅమ్మాయిని మన ఊరికి తీసు
కొచ్చాను నాన్నా!

రామ: ఆరి భడవా! ఎంత సాహసంరా నీకు?

జాన : నాకొడుక్కి ఆమాత్రం సాహసం లేకుండా...

రామ: జానకీ! నువ్వూరుకో?

జాన : అట్లాగేనండీ!

రామ: అయితే రవీ! ఆ అమ్మాయి యేదిరా?

రవి : మేం ప్రొద్దున బస్సుదిగి యింటికి వస్తుంటగా- దారిలో
మాలగూడెంలో - ఒకస్త్రీ ప్రసవవేదన పడుతున్నది

నాన్నా! మొదటి కానుపట! ఇంట్లోవాళ్ళందరు యేడుస్తున్నారు వైద్య సహాయంలేక! ఆమెకు వైద్య సహాయం చేయడానికి వెళ్ళింది నాన్నా!

రామ: పాపం ఎవర్రా ఆ ప్రసవ వేదనపడుతున్న స్త్రీ?

రవి : అదే నాన్నా? పోయిన సంవత్సరం మనదగ్గఱ జీతం ఉన్నాడే - రాముడు - వాడి పెళ్ళామట నాన్నా!

రామ: చూడు రవీ! బయటినుంచి యెవరో మన యింట్లోకి వస్తున్నారు! ఆ అమ్మాయి కాదుగదా!

రవి : ఆ అమ్మాయే నాన్నా!

(సరోజిని ప్రవేశము)

రవి : [ముందుకువచ్చి] సరోజినీ! రా! ఇదే మా యిల్లు! వీరు మా నాన్నగారు! వీరు మా అమ్మగారు!

[సరోజిని రామనాథం. జానకమ్మలకు నమస్కరించును]

రామ: మంచిభర్తను సంపాదించుకుని చిరకాలం వర్థిలమ్మా!

జాన : పసుపు కుంకుమలతో కలకాలం జీవించు తల్లీ!

రామ: నీవు వెళ్ళిన పనేమయింది? రాముడి పెళ్ళాం సుఖంగా ప్రసవించిందా?

సరో : మగపిల్లవాడండీ! తల్లీ పిల్లా సుఖంగా వున్నారు! నేను లేకపోతే వైద్యసహాయంలేక ప్రమాదం జరిగివుండేది!

రామ: దైవానుగ్రహం! దేవతలాగ వచ్చి వాళ్ళను బ్రతికించావు?

సరో : నేను నాకర్తవ్యాన్ని నిర్వహించాను? అంతే!

రామ: ఇంటికొచ్చిన అతిథిని నిలుచోబెట్టి మాట్లాడటం బాగా

లేదు. అమ్మాయీ! ముందు స్నానం జేసి బట్టలు మార్చుకో. తరువాత అన్ని విషయాలు మాట్లాడు కుందాం. జానకీ! అమ్మాయిని లోపలికి తీసుకెళ్ళు.

జాన : అట్లాగేనండి.

[జానకమ్మ సరోజినిని లోపలికి తీసుకొని పోవును]

[తెర బడును]

## రెండవ రంగము

[రామనాథం, రవీంద్ర కుర్చీలలో కూర్చునియుందురు]
[రవీంద్ర పేపరు చదువుకొను చుండును]

[తెర యెత్తబడును]

రామ: జానకం! ఓ జానకం!

జాన : (లోపలినుండి ప్రవేశించి) అబ్బబ్బబ్బ! ఎందుకండీ అట్లా పిలుస్తారు?

రామ: అమ్మాయి స్నానంచేసి బట్టలు మార్చుకున్నదా?

జాన : ఎందుకట్లా తొందరపడతారు? స్నానం చేసింది! బట్టలు మార్చుకుంటున్నది!

రామ: తొందరేం లేదుగాని, ఆ అమ్మాయి యెవరో, ఊరూ పేరు తెలుసుకోవాలని కుతూహలంగా వుందే!

జాన : నాకూడా కుతూహలంగానే వుందండీ!

రామ: అడగక పోయావా?

జాన : నేను అడగలేదండీ! మీరే అడగండి! అదిగో ఆ అమ్మాయి వస్తోంది!

(సరోజిని ప్రవేశించి రవీంద్ర ప్రక్క నిలుచుండును)

జాన : (రామనాథంతో నెమ్మదిగా) ఈ అమ్మాయి యెవరో గాని మహాలక్ష్మిలా వుందండీ! మన కోడలైతే యెంత బావుంటుంది!

రామ: (జానకమ్మతో నెమ్మదిగా) ఈ అమ్మాయి మన బాబు ప్రక్కన నిలుచుంటే మన యింటికే కళ వచ్చిందే! (సరోజినితో) అమ్మాయీ! నీ పేరేమిటి?

సరో : సరోజినండీ!

రామ; ఇంటి పేరేమిటమ్మా?

సరో : ఆత్మచింతనం వారండీ!

రామ; ఏమిటే! ఆత్మచింతనం వారా?

సరో : అవునండీ! ఆత్మచింతనం వారు!

రామ; తండ్రి పేరు?

సరో ; లక్ష్మీనారాయణరావు గారండీ!

రామ: మీ తాతగారి పేరు?

సరో : పార్వతీశంగారండీ?

రామ: ఏదీ మళ్ళీ చెప్పమ్మా మీ తాతగారి పేరు?

సరో ; ఆత్మచింతనం పార్వతీశం గారండీ! మా తాతగారికి పిల్లలులేకపోతే మానాన్నగారిని దత్తు చేసుకున్నారండీ!

రామ: మీ దేశ్వాసు తల్లి ?

సరో ; కూచిమంచి గ్రామం, ఆదిలాబాదు జిల్లా.

రామ: ఓహో! జానకీ! చూశావా చిత్రం! నా చిన్ననాటి స్నేహితుని మనుమరాలే యీ పిల్ల! నేను ఆ ఆత్మ చింతనం పార్వతీశం ఒక్క గురువు దగ్గఱ చదువు నేర్చుకున్నాం! ఒక్కతల్లి పిల్లలవలె మెలిగాం!

జాన ; చూశారా! ఇంకోచిత్రం! చిన్నప్పుడు దత్తుపోయిన మా రెండో అన్నగారి కూతురేనండీ యీ అమ్మాయి! ఆ ఆత్మచింతనం పార్వతీశంగారు మా కుదూరపుచుట్టం. వారికి పిల్లలు లేకపోతే మా రెండో అన్నగారిని దత్తు చేసుకున్నారు. చాలా దూరప్రాంతం అవడంవల్ల వాళ్ళకూ మాకూ సంబంధాలు లేకపోయినయ్! చూశారా దైవనిర్ణయం! (సరోజినితో) అమ్మా! సరోజినీ! దగ్గఱకు రా! నువ్వు దత్తువెళ్ళిన నా రెండో అన్నగారి కుమార్తెవమ్మా! (సరోజినిని కౌగలించుకుని ముద్దు పెట్టుకొనును.)

విర ; చూశారా నాన్నా! నేను పొరపాటు చేశానేమో!

రామ; చూశావా జానకీ! నాకొడుకెప్పుడు పొరపాటుచేయడు.

జాన ; మనబ్బాయి యెప్పుడు పొరపాటు చేయడు అవునండి!

రామ; [సరోజినితో] అయితే అమ్మాయీ! సరోజినీ! మా అబ్బాయిని ప్రేమించావా?

జాన ; లేదండీ! మీరు అనుమతిస్తే పెళ్ళి చేసుకుంటామండీ!

రామ; ఒకవేళ మేము అందుకు ఇష్టపడకపోతే?

సరో ; (మౌనం)

రామ; మరి మీ పెళ్ళి అయ్యాక ఏం చెయ్యాలనుకుంటున్నారు?

సరో ; ఉద్యోగాల్ని ఆశించకుండా గ్రామాలలో నివసిస్తూ వైద్య సౌకర్యంలేని గ్రామ ప్రజానీకానికి సేవ చేయ దలచు కున్నామండి!

జాన ; మీరు ప్రజా సేవలో మునిగిపోతే వృద్ధులమైన మా సేవ ఎవరు చేస్తారమ్మా?

సరో ; మీ సేవ తరువాతనే దేశసేవ చేస్తామండి అత్తయ్యా!

రామ; [జానకమ్మతో] చూడవే! నా కోడలు ఎంత వినయంగా జవాబు చెపుతోందో!

జాన ; నా మేనకోడలు కాబట్టే ఇంత చక్కగా జవాబు చెబుతోంది. మా పుట్టింటి వారంటే ఏమనుకున్నారు?

రామ; నా చిన్ననాటి నా స్నేహితుని మనుమరాలు కాబట్టే ఇంత చక్కగా జవాబు చెబుతోంది! ఇంతకు కోడలు నచ్చిందా?

జాన ; ఎన్ని నోములు నోస్తే యింత చక్కని కోడలు దొరుకుతుందండీ! మన అదృష్టం! మరి మీకు నచ్చిందా ఈ కోడలు?

రామ; నచ్చిందా అని అడుగుతా వేమిటే? మన నోము పంట ఈ ఇంటికి మహా లక్ష్మి. మణిదీపం. చూశా జానకీ! మన ఇష్టాలి కోరికలు నెరవేరినయ్. అటు పుట్టింటి వారమ్మాయి, ఇటు నా స్నేహితురాలి మనవరాలు. అంతే గాకుండ మన అబ్బాయి ప్రేమించి పెళ్లి చేసుకోదలంచిన అమ్మాయి, అందరికీ నచ్చిన కోడలు.

జాన ; ఇంక ఆపండి మీ పొగడ్తలు.

రామ; అమ్మాయీ సరోజినీ!

సరో ; ఏమిటి మామయ్యా.

రామ; అబ్బాయి. రవీంద్రా!

రవి : ఏమిటీ నాన్నా?

రామ; మీ రిద్దరు పెళ్ళి చేసుకో దల్చుకున్నారు కదూ?

రవి ; అవును నాన్నా.

సరో ; అవును మామయ్యా.

రామ; అయితే మీ పెళ్ళికి రెండు షరతులు పెడుతున్నాను.

రవి ; చెప్పండి నాన్నా. ఆ షరతులేమిటో తప్పక పాటిస్తాం.

రామ; అయితే వినండి. చెబుతున్నా. ఒకటి... ఈ రోజే... ఇప్పుడే...ఇక్కడే...

రవి ; ఈరోజే - ఇప్పుడే - ఇక్కడే - ఏంచేయాలి నాన్నా?

రామ; మీరిద్దరు ఒకరి మెడలో ఒకరు పూలదండలు వేసుకొని వరించాలి.

సరో ; (చిరునవ్వుతో) అయితే రెండోది చెప్పండి మామయ్యా.

రామ; పది హేను రోజుల్లో ఒక మంచి సుముహూర్తంవుంది. ఆ సుముహూర్తానికి మీ పెళ్ళి కావాలి. ఇప్పుడే మీ నాన్న గారికి ఉత్తరం వ్రాస్తున్నా. పెళ్ళి ప్రయత్నా లన్నీ వెంటనే చేసుకోమని.

సరో ; మీరెంత మంచివారండీ మామయ్యా. మా పెళ్ళికి మీరు అనుమతిస్తారో లేదో అని భయపడ్డాం... కానీ,

రామ; కాని - అంటున్నా వేమిటమ్మాయి?

సరో ; మీరు ఆసించినంత కట్నం మా వాళ్ళు ఇవ్వలేరేమో నండీ. మాది సామాన్యమైన కుటుంబం.

జాన ; (రామనాథంతో) కట్నం గురించి బాధపడవద్దని ఉత్తరంలో వ్రాయండి.

రామ; ఆ సంగతి నువ్వు చెప్పనవసరం లేదు. ఒక్క పైసా కూడ కట్నం తీసుకోనబడదని, ఇచ్చినా పుచ్చుకోన బడదనీ వ్రాస్తాను. సరా?

సరో ; మీ నాన్న గారు ఎంత మంచివారు?

రవి ; మా నాన్న ఎంత మంచివారో మా అమ్మ కూడా అంత మంచిది సరోజా.

రామ; ఈ శుభ సమయంలో ఇంకో విషయం కూడా చెబుతున్నాను. వినండి.

రవి ; చెప్పండి నాన్నా.

సరో ; చెప్పండి మామయ్యా.

రామ; మనకు ఈవూరి పొలిమేరలో ముప్పయి ఎకరాల రేగడి భూమి వుంది. అవి అమ్మితే లక్ష రూపాయలు వస్తవి.

రవి ; లక్షరూపాయలతో ఏం చేయాలి నాన్నా?

సరో ; ఏం చేయాలి మామయ్యా?

రామ; ఒక ప్రసూతి ఆసుపత్రిని మన గ్రామంలో నడపవలసి నదిగా కోరుతున్నా. ఈ చుట్టుపక్కల గ్రామాలలో ప్రసూతి వైద్యసౌకర్యం లేక ఎంతోమంది గర్భిణీ స్త్రీలు మరణిస్తున్నారు. చూశావమ్మా సరోజినీ! ఈ రోజు నీవు రాకపోయినట్లయితే ఆ రాముడి పెళ్ళాం ప్రసవించలేక ఏమయ్యేదో గదా!

సరో ; అట్లాగే మామయ్యా. మీరు చేసిన త్యాగం సార్థకం అయ్యేటట్లు ప్రయత్నిస్తాం!

రవి ; ఇందుకు నేను సర్వవిధాలా కృషి చేస్తాను నాన్నా!

[పళ్ళూ, పూలు పళ్ళెంలో పెట్టుకుని రాముడి ప్రవేశం]

సీతితో తిరణాళ్ళ కెళ్ళాలి!
సీతితో తిరణాళ్ళ కెళ్ళాలి!
చిట్టి మా పాపణ్ణి శివుడికీ చూపాలి!
సీతితో తిరనాళ్ళ కెళ్ళాలి!
సీతితో తిరనాళ్ళ కెళ్ళాలి!

(పాట పాడుకుంటూ, గంతులు వేసుకుంటూ

రాముడి ప్రవేశం)

రామ: ఒరేయ్ రాముడూ! ఆపాటేమిటి? ఆగంతు లేమిటి? ఆపళ్ళూ, పూలు యెవరికిరా తీసుకొచ్చావు?

రాము; దణ్ణాలండీ అయ్యగారో! దణ్ణాలండీ జానకమ్మ గారో మీా యింటి కొచ్చిన లచ్చివమ్మోరు గారి కోసమే యీా పళ్లూ, పూలూ తీసుకొచ్చానండీ అయ్యగారో! మీా యింటికొచ్చిన లచ్చివమ్మోరు వల్లే నాసీత బతికి బయట పడిందండీ! లేకపోతే నాసీతి కానుపు కనలేక సచ్చిపోయే దండీ! దేవతలాగవచ్చి రచ్చించిందండీ! నా యిల్లు నిలబెట్టిందండీ! అయ్యగారో! నాకు సక్కదనాల కొడుకు పుట్టాడండీ! ఈ పళ్లూ, పూలు మీా యింట్లో వున్న అమ్మగోరుకిచ్చి దణ్ణం పెట్టాలని వచ్చానండి-అమ్మగారో! ఓ డాక్టరమ్మగారో! ఈపళ్లూ, పూలు తీసుకోండి అమ్మగారో.

సరో ; రాముడూ! నేను చేసిందేముంది? మానవుడు మానవునికి చేయవలసిన కొన్ని విద్యుక్తధర్మాలు వున్నాయి. అదే నేను చేసింది? అంతకంటే యేమీాలేదు. ఈ గౌరవం నాకు అవసరంలేదు.

రాము; నేను సచ్చి మీాకడుపున పుడతానండీ? ఇంతకంటే నేనేమి యివ్వలేను అమ్మగారో! ఈపళ్లూ, పూలు తీసుకోండమ్మగారో.

రాము; వాడంతగా కోరి యిస్తూవుంటే వద్దన కూడదమ్మా. సరోజినీ! తీసుకో! అందులో పళ్లూ, పూలూ యెవరిచ్చినా వద్దనగూడదు.

సరో : వద్దు మామయ్యా! వద్దు!

రామ: సరే! ఓగో! రాముడూ! మంచి సమయానికి పూల

దండలు, పళ్ళు తెచ్చావురా! ఇటు తే! ఆ అమ్మా
యికి బదులు నేను తీసుకుంటాను!

[రాముడు నాలుగు పూలదండలు, పళ్ళు వున్న
పళ్లెం రామనాథంగారికి యిచ్చును]

రామ; [పళ్ళాన్ని బల్లమీద పెట్టి ఒక పూలదండ చేతితో తీసు
కొని] అమ్మాయి సరోజినీ! ఈ పూలదండను నువ్వు
తీసుకో! [మరియొక పూలదండను తీసుకొని] రవీ! ఈ
పూలదండను నీవు తీసుకో! మీరిద్దరూ ఇప్పుడే-
ఇక్కడే — మా కళ్ళముందు — పూలదండలు ఒకరి
మెడలో ఒకరు వేసుకొని వరించండి!

[రవీంద్ర, సరోజినులు సిగ్గుతో పూలదండలు ఒకరి
మెడలో ఒకరు వేసుకొని వరింతురు]

జాన ; [రామనాథంతో] ఏమండోయ్! పళ్ళెంలోవున్న ఆ
పళ్ళు నా చేతికివ్వండి! కోడలు ఒడినింపుతా.
త్వరలో ముద్దులుకారే కొడుకును కనమని!

[జానకమ్మ కోడలు ఒడిలో పండ్లు పెట్టును.
రవీంద్ర సరోజినులు రామనాథం, జాన
కమ్మలకు నమస్కరింతురు]

రామ; ఆదర్శ పవిత్ర పావన ప్రణయ బద్ధులై, ప్రజాసేవ జేస్తూ,
చిరకాలం జీవించండి!

జాన ; పుట్టినింటికీ, మెట్టినింటికీ కీర్తి తే తల్లీ!

రవి ; నాన్నా, ఇంతకూ మీకు కోడలు నచ్చిందా?

రామనాథం : నాకు నచ్చకపోవడమేమిట్రా? నాకు-నీకు-మీ అమ్మకు, ఇంట్లో అందరికీ నచ్చిన కోడలు.

రాముడు : అయ్యగారూ! మీ యింట్లో అందరికీ నచ్చిన కోడలు మాత్రమే కాదండోయ్! ఊళ్ళో వాళ్ళందరికీ నచ్చిన కోడలు. మా వూరికి మాలచ్చివమ్మొచ్చారు.

రామనాథం : జానకీ. ఇలా దగ్గరకు రా.

జానకమ్మ : ఎందుకండీ?

రామనాథం : ఇవ్వాళే మాఘ శుద్ధ సప్తమి. మనకు వివాహ మయినరోజు.

జానకమ్మ : అవునండీ.

రామనాథం: సరిగ్గా అదేరోజున-కోడలు మనయింట్లో అడుగు పెట్టడం - మనవాళ్ళయిని వరించడం జరుగుతోంది.

జానకమ్మ : ఇదంతా దైవచిత్రం.

రామనాథం ; పళ్ళెంలో ఇంకా రెండు పూలదండలు మిగిలి వున్నాయ్.

జానకమ్మ : ఆ పూలదండలను యేం చేద్దామంటారు?

రామనాథం : ఈ ఆనంద శుభ సమయంలో మనం కూడ వేసుకుందాం జానకీ.

జానకమ్మ : ఎవరన్నా చూస్తే నవ్వుతారండీ. మీకు సిగ్గులేక పోతే నా కన్నా సిగ్గులేదనుకున్నారా?

రామనాథం; పరవాలేదు దండలు వేసుకుందాం! ఇక్కడమాత్రం పరాయివారు ఎవరున్నారు? కొడుకు, కోడలేనా?

రాముడు : నేనుకూడ వున్నానండి.

జానకమ్మ ; వస్తుండి వస్తు!

[ రామనాథం రెండుపూలదండలను తీసుకొని, ఒక పూలదండను జానకమ్మ చేతికిచ్చి, ఒక పూలదండను జానకమ్మ మెడలో వేయును. జానకమ్మ చేత బలవంతంగా పూల దండను తనమెడలో వేయించుకొనును. అక్కడ వున్న వారందరు ఇది చూచి లోలోపల నవ్వుకొనుచుందురు]

వంటలక్క ; (ప్రవేశించి) బాబుగారూ! వంట సిద్ధముగావుంది! వడ్డించమంటారా?

రామనాథం : నువ్వు లోపలికి పద. ఇప్పుడే వస్తున్నాం.

వంటలక్క: చిత్తం! (వంటలక్క వెళ్లిపోవును)

రవీంద్ర : ఇంక భోజనానికి లేద్దాం నాన్నా పన్నెండు గంటలయింది.

రామనాథం ; (రవీంద్రతో) ఒరేయ్ రవీ! ఇందాక నీ స్నేహితుణ్ణి ఎవరినో భోజనానికి పిలిచానని చెప్పావు. ఏడీ ఆ స్నేహితుడు?

రవీంద్ర : వట్టిదే నాన్నా! సరోజిని వచ్చేవరకు మన భోజనాలను ఆపుదామని అవిధంగా అబద్ధం చెప్పాను నాన్నా!

రామనాథం: అరి భడవా! అబద్ధాలుకూడా నేర్చావన్నమాట.

రవీంద్ర : లేదునాన్నా.

జానకమ్మ : మంచిపని చేశావురా.

రామనాథం : జానకీ నువ్వూరుకో.

జానకమ్మ : అట్లాగేనండీ.

రామనాథం : ఇంక భోజనాలకు లేద్దాం! ఒక మరతు.

జానకమ్మ : ఏమిటా మాట! మీ మాటలతో మా ప్రాణాలు పోతున్నాయ్!

రామ: మన భోజనాలయిపోతేగాని మనల్ని ఎవరూ పూల దండలను తీసివేసుకోనివ్వరు!

జాన ; భోజనాలయిపోతేగాని ఏం ఖర్మ? ఊళ్ళో వాళ్ళందరు వచ్చి నవ్వి పోవటము చూస్తుంటాం! ఇంక లేవండి భోజనానికి!

కవి : సరిగ్గా పన్నెండు గంటలయింది నాన్నా!

రామ: అభిజిత్ లగ్నం! చక్కని శుభ సమయం! ఒరేయ్ రాముడూ! ఇవ్వాళ నువ్వుకూడా మా ఇంట్లో భోజనం చేయాలి రా!

రాముడు: అయ్యగారూ! జానకమ్మగారు మీ కోసం చేసిన లడ్డు వాల్నీ నేనే తింటానండీ!

రామ: జానకీ! చూశావా! నా మాటే నెగ్గింది! నా కోడలు నా చిన్ననాటి స్నేహితుని మనుమరాలు!

జాన ; ఏమండీ! చూశారా! నా మాటే నెగ్గింది. నా కోడలు మా అన్నగారి కూతురు! మా పుట్టింటివారి సంబంధం!

రామ: నా స్నేహితుని మనుమరాలు, నామాటే నెగ్గింది.

జాన : మా పుట్టింటివారి సంబంధం! నామాటే నెగ్గింది.

(ఒకరికొకరు తలలు ఆనించుకొందరు)

రామ: నామాటే నెగ్గింది.

జాన : నామాటే నెగ్గింది.

రామ: నామాటే నెగ్గింది.

జాన : నామాటే నెగ్గింది.

రాముడు; (పకపక నవ్వుతూ) అదేంటండోయ్ అయ్యగారో!
అదేంటండోయ్ అమ్మగారో! మీరిద్దరూ గొర్రెపోతుల్లా పోట్లాడుకుంటుండారు! అహాహా! అహాహా!

(రాముడు పకపక నవ్వుచుండును)

[సరోజిని రఘురాములు - రామనాథం జానకమ్మలను జూచి నవ్వుచుందురు]

[అందరు నవ్వుటజూచి రామనాథం, జానకమ్మలుకూడా నవ్వుచుందురు]

[రంగమంతయు నవ్వులతో ప్రతిధ్వనించును]

[తె ర బ డు ను]

—: స మా ప్త ము :—

# హృదయం వున్న మనుష్యులు

[సాంఘిక హాస్య ఏకాంక నాటిక]

---

## ఇందలి పాత్రలు:

1. రాఘవయ్య: [కమలాకర్ తండ్రి]
2. సుందరమ్మ: [రాఘవయ్యగారి భార్య]
3. కమలాకర్: [రాఘవయ్యగారికుమారుడు]
4. రోహిణి: : [కమలాకర్ భార్య]

---

(రాఘవయ్య కుర్చీలో కూర్చొని పత్రిక చదువు చుండును)
(తెర యెత్తబడును)

సుందరమ్మ : [తెరలో] కోడలమ్మా! ఓ కోడలమ్మా ఎంత ప్రొద్దెక్కిందో చూచావా? [ప్రవేశించి, భర్త రాఘవయ్యతో] ఏమండీ! చూచారా? కోడికూసి నాలుగు గంటలయింది. పక్షులు పలికి రెండుగంటలయింది. సూర్యుడు ఉదయించి గంటసేపయింది. గంటసేపటి నుండి కోడలమ్మగారిని నిద్రలేపుతున్నా. ఏమనుపునుండి లేస్తేనా?

రాఘవయ్య : ఒసేవ్! కోడలమ్మతో నీకేం పనే? కోడలమ్మ లేచినప్పుడు లేస్తుంది. లేచినప్పటినుండి మీ యిద్దరికి పోట్లాటేగా!

సుంద : మీరు కూడా అల్లా అంటారు! ఇంట్లో చాకిరీ యెవరు చేస్తారు? ఈ బండెడు చాకిరీ నన్నే చేయమంటారా?

రాఘు : పని మనిషి వచ్చిందిగదే! దానితో చేయించరాదూ పనులన్నీ.

సుంద : పనిమనిషి చేసే పనులు పనిమనిషి చేస్తుంది. వంటింట్లో వార్పులు-వడ్డింపులు పనిమనిషితో చేయించమంటారా? వంటలక్క ఊరుపోయిందనే సంగతి మీకు తెలీదూ?

రాఘు : నాలుగు రోజులు యెలాగో సర్దుకుపో! ఇంతలో వంటలక్క రానేవస్తుంది.

సుంద : వంటలక్క నాలుగు రోజుల్లో రానే వస్తుందన్న సంగతి నాకూ తెలుసు! అప్పటిదాకా యెట్లా జరగాలన్నదే యిప్పటి మాట.

రాఘు : అయితే నన్నేం చేయమంటావే. వంటింట్లోకి వెళ్ళి నన్ను వంట చేయమంటావా?

సుంద : మీరు కూడా యిల్లా మాట్లాడితే యెల్లాగండీ! ఎవరింట్లో నన్నా భయం భక్తీ లేక యింతసేపు కోడళ్ళు నిద్రబోతున్నారేమో చూచిరండి.

రాఘు : ఎవరింటికి వెళ్ళమంటావే చూచిరావడానికి? ఒసేవ్! మనకి మాత్రం యెవరున్నారు! ఒక్క కొడుకు! ఒక్క కూతురు. కూతురు అత్తగారింటికి వెళ్ళి పోయింది! మనకున్నది ఒక్క కొడుకు — యీ కోడలే గదే! ఎందుకట్లా నిత్యం వాళ్ళతో పోట్లాడుతావు?

సుంద : కొడుకు మంచివాడయితే యీ కోడలమ్మ ఈ విధంగా

నెత్తిమీద కెక్కిందా? నేను నిత్యం వాళ్ళతో పోట్లాడుతున్నానా?

రాఘు : అప్పుడు! నీకు కోడలంటే పడనే పడదాయె! అగ్గిలో గుగ్గిలంవేసినట్టే భగ్గుమంటుంటావు.

సుంద : అబ్బో! ఇంత చక్కని కోడలు యెవరికయినా దొరుకుతుందా మరి?

రాఘు : మనకోడలికేమి తక్కువ చెప్పుకొమ్మ! పూర్వ సంస్కారం వున్న కుటుంబంలోంచి వచ్చింది! ముప్పయివేల కట్నంతో లక్ష్మీదేవిలా మన యింటికొచ్చింది!

సుంద : అందరికీ కట్నాలు ఇవ్వటంలేదా? మనకే యిచ్చారా! మన తమ్ముల బంధువుల్లోవున్న నూరెకరాల పొలం విలువ చెయ్యవు ఆ ముప్పైవేలు!

రాఘు : ఆ ముప్పైవేలు యివ్వడానికి ఆ పిల్ల తల్లిదండ్రులు ఎంత కష్టపడ్డారో తెలుసా?

సుంద : ఏం కష్టపడ్డారు?

రాఘు : ఈ పిల్ల పెళ్ళికోసం ఉన్న ఆస్థి అంతా అమ్ముకోవలసి వచ్చింది.

సుంద : అమ్ముకుంటే మనకేం! వాళ్ళ అవసరం వుండి వాళ్ళ అమ్మాయి పెళ్ళి కావడానికి అమ్ముకున్నారు.

రాఘు : భగవంతుడు నీకు హృదయం అనేది యివ్వలేదనుకుంటాను ఇస్తే యీ విధంగా నువ్వు మాట్లాడదానివి కావు. కట్నంకాక వాళ్ళ అమ్మాయి పెళ్ళి ఖర్చులకు పదివేల రూపాయలయింది.

సుంద: ఇచ్చాగలే ముప్పయి వేలు! ఆడబిడ్డకట్నంయేమిచ్చారు!

రాఘు: ఇచ్చారుకదే వెయ్యిరూపాయలు!

సుంద: మీ రా మాటంటుంటే నావొళ్ళు మండుకుపోతోంది వెయ్యిరూపాయిలేనా ఆడబిడ్డ కట్నం? ఒక్కగానొక్క బిడ్డ ఉసూరుమంటూ వెళ్ళిపోయింది.

రాఘు: వెయ్యిరూపాయలు గాక యెన్ని వేలు యిస్తారేటావే ఆడబిడ్డ కట్నం?

సుంద: ఆడబిడ్డ కట్నం వెయ్యికి వంద మామూలే! లెక్క ప్రకారం మూడు వేల రూపాయలు యివ్వాలిసింది.

రాఘు: నీతో నేను వాగలేనుగాని కాఫీ చేస్తావా? లేదా?

సుంద: కోడలమ్మతో చేయించుకు త్రాగండి! నాకు ఓపిక లేదు.

రాఘు: సరేలే! హోటల్‌కి వెళ్ళి త్రాగుతాలే! నీలాంటి వాళ్ళ వల్లే స్వర్గసీమల్లా వుండే గృహాలు నరకకూపాలుగ తయారవుతాయి!

సుంద: మీరిలా అనబట్టే నేను కోడలిముందు పలుచనయి పోతున్నాను! అందరూ నన్ననేవాళ్ళే. సరే అవండి.

[రాఘువయ్య పై పంచె వేసుకొని బయటకు వెళ్లిపోవును]

సుంద: [లోపలి గదివైపు చూచి] కోడలమ్మగారు! ఓ కోడలమ్మగారు? ఇకనైనా నిద్రలేస్తారా లేవరా?

రోహిణి: [ప్రవేశించి] ఎందుకండి అలా నిద్రలేపుతారు? ఏడు గంటలుకూడ కాలేదు.

సుంద: ఏడుగంటలకునిద్ర లేస్తే యింట్లోచాకిరీ యెవరు చేస్తారు!

రోహిణి: మీరు, పని మనిషి ఉన్నారుగా!

సుంద ; నన్ను పనిమనిషి క్రింద జమకడతావటే! ఎంత పొగరు!

రోహి : నేనేం మిమ్మల్ని పనిమనిషి క్రిందజమకట్టలేదు! మీరూ, పనిమనిషి ఉన్నారు గదా! అని అన్నాను!

సుంద : అంటే అర్థం?

రోహి : మీరు పనులు చెప్పడానికి, పనిమనిషి పనులు చేయడానికి!

సుంద : పనిమనిషి పాచిపనులు చేస్తుంది. వంటలక్క ఊరి కెళ్ళిన సంగతి నీకు తెలియదూ?

రోహి : మరి మీరేం చేస్తారు? వంటపని చెయ్యవచ్చుగా!

సుంద : నేను వంటపని చేస్తే మరి నువ్వేం చేస్తావు?

రోహి ; వంట కాగానే వడ్డించుకుతింటాను!

సుంద ; నీకు వంట చేసిపెట్టడానికి నేనేం వంటలక్కనటే!

రోహి : వంటలక్కవని నే ననలేదు! మీరు వంట చెయ్యక పోతే మరెవరి చేతనయినా వండించుకు తింటాను? ఈ యింటికి నేను యజమానురాలిని!

సుంద : ఈ యింటికి నిన్నగాక మొన్న వచ్చిన నీవు ఎట్లా యజమానురాలివి అవుతావే! నేను యజమానురాలిని.

రోహి : నిన్నా మొన్నా నేను వస్తే-మీరు ఆవలిమొన్న వచ్చి వుంటారు! ఈ యింటిమీద మీకెంత అధికారముందో నాకూ అంత అధికారం వుంది!

సుంద : నీ కేంటుంటుందే అధికారం? నా కుంటుందిగాని! నీవు నా కొడుకు పెళ్ళానివి, కోడలివి.

రోహి : నేను మీ కొడుకు పెళ్ళాన్నయితే మీరు మా మామగారి పెళ్ళాం గాన్నా అత్తయ్యా! నేను వచ్చినట్లే మీరుకూడా ఒకనాడు—ఒక యింటినుండి ఈ యింటికి వచ్చారు.

సుంద ; ఇదంతా నా భర్త ఆస్తి! మీ మామయ్య సంపాదించింది?

రోహి : మా మామయ్య సంపాదించింది మాత్రమే కాదు అత్తయ్యా! మీ మామయ్య సంపాదించిందికూడా కొంత వుందని తెలుసుకోండి!

సుంద : ఈ యిల్లు మాది! ఈ యింట్లో నుండి వెళ్ళండి! వేరే కాపురం పెట్టుకొని బ్రతకండి.

రోహి : ఈ యిల్లు-మీ మామగారు—మా వారి తాతగారు కట్టింది! చట్టప్రకారం తాతగారి ఆస్తి మనుమడికి చెందుతుంది! మీరే యెక్కడికైనా వెళ్ళి వేరేకాపురం పెట్టండి! ఈ యిల్లు మాది.

సుంద : మాటలు నేర్చిన కుక్కను వేటకు తీసుకెళితే ఇస్కో అంటే ఇస్కో అందిట! ఎంతమాట! మేము ఈయింట్లో నుంచి వెళ్ళిపోయి వేరే కాపురం పెట్టాలా?

రోహి ; వేరే కాపరం పెట్టమని మీ రంటే నే నన్నాను! అంతే! ఒకటనకండి! రెండు పడకండి.

సుంద : ఒరేయ్ కమలాకరం! గదిలోనుండి బయటికి రావేమిరా! నీ పెళ్ళాం వన్ను నానామాటలు అంటుంది! నేనూ-మీ నాన్నా-ఈ యింట్లోనుంచి వెళ్ళిపోవాలట

కోడలమ్మ ఒక్కతే నిన్ను పెట్టుకొని ఈయింట్లో కులుకుతుండటం!

రోహి : నాన్న అంత తెలివి తక్కువ వారుకారు! మన ఆడ వాళ్ళ తగువుల్లో తలదూర్చడానికి!

సుంద ; ఎందుకు దూర్చకూడదు? కని పెంచిన తల్లిని. నా తరఫున మాట్లాడతాడు!

రోహి ; నాన్న మీ తరఫున మాట్లాడరు!

సుంద ; ఎందుకని?

రోహి : వారిని నేను కొనివేశాను.

సుంద ; ఎప్పుడు?

రోహి : పెళ్ళినాడు!

సుంద ; ఎంతకి?

రోహి ; ముప్ఫయి వేలకి!

సుంద : అబ్బో! ఈమే కట్నమిచ్చి పెళ్ళిచేసుకుంది! లోకంలో యెవరన్నా కట్నాలిచ్చి పెళ్ళిచేసుకున్నారా?

రోహి ; లోకం సంగతి నా కక్కరలేదు! నేను మాత్రం మీ అబ్బాయిని ముప్ఫయివేలు కట్నమిచ్చి కొనుక్కున్నాను. వారు నా మాట జవదాట గూడదు.

సుంద : ఒరే కమలం! గదిలోనుండి బయటికిరారా! నీపెళ్ళాం నన్ను నానామాటలంటుంటే వింటూ గదిలో కూర్చున్నావు!

[కమలాకర్ ప్రవేశించును]

**కమ** ; ఏమిటమ్మా ప్రొద్దున్నే ఈ గోల?

సుంద ; చూడరా కమలం! ఇంట్లో ఏ పనీ చెయ్యదట! నేను యీవిడగారికి వండి వడ్డించాలట! లేకపోతే నేను-మీ నాన్న ఈ యింట్లోనుంచి వెళ్ళిపోవాలట! చూశావా యీ మాటలు! కోరి కోరి యెటువంటి కోడల్ని తెచ్చాడురా మీ నాన్న

కమ : రోహిణీ ఏమిటీగోల? పెద్దవాళ్ళు ఏమన్నా అంటే సర్దుకుపోవాలి.గాని మాటకు మాట బదులు పలికి యిట్లా రభస చెయ్యవచ్చా! పైగా చదువుకున్న దానివి!

రోహి ; నేనేం రభస చేశాను? మీ అమ్మగారే రభస చేస్తోంది! రాత్రి మీరేగా నన్ను రెండో ఆట సినిమాకు తీసుకెళ్ళారు! వచ్చేటప్పటికి ఒంటిగంట అయింది గదా! తలకాయ నొప్పిగావుండి యిప్పటిదాక పండుకున్నాను! అందుకే యీ రాద్ధాంతం-సిద్ధాంతం.

కమ ; ఊరుకో అమ్మా! అదే చేసుకుంటుంది యింటిపని. నీ కెందుకు? నువ్వు పూజామందిరంలో కూర్చుని భాగవతం చదువుకో అమ్మా!

సుంద ; ఏం చదువుకోనురా బాబూ! మనశ్శాంతి లేకుండా బాధపడుతున్నాను. ఇటువంటి కోడలుతో నేను వేగలేను.

రోహి : వేగలేకపోతే వేరే ఉండకూడదా అత్తగారూ!

సుంద ; చూడరా కమలం! నీ పెళ్ళాం మాటలు! మేము వేరే ఉండాలట.

రోహిం ; మరి నాతో యేగలేక పోతున్నానని మీరే గదా యిప్పుడంటున్నారు.

కమ ; అమ్మా! మీ అత్తా కోడళ్ళమధ్య నేనూ-నాన్న నలిగిపోతున్నాము! రోహిణీ! అనవసరంగా-ఎందుకు మాటకు మాట జవాబు చెబుతావు? ఏదన్నా పెద్ద వాళ్ళు అంటే—ఊరుకుంటే సరిపోదూ?

రోహిం ; చెప్పుక్రింద తేలుమాదిరిగా పడివుండడానికి నేనుదాసీ దాన్నిగాను! ఈ యింటి కోడల్ని. ఇంటర్ పాసయ్యాను ముప్ఫయివేలు కట్నంతో మిమ్మల్ని కొనుక్కు-న్నాను!

సుంద ; చూశావురా దాని మాటలు. ముప్ఫయివేలు కట్నం పోసి నిన్ను కొనుక్కున్నదట!

రోహిం : అవును! మీ అబ్బాయిని కొనుక్కున్నాను! మానాన్న గారు తన కున్నదంతా అమ్మి, నా సుఖంకోసం—మీ అబ్బాయిని కొని నా కిచ్చారు! మీకు ఇకనుండి మీ అబ్బాయిమీద ఎటువంటి అధికారం లేదు!

సుంద ; చూశావురా కమలం! ఏ విధంగానన్ను తీసి పారేస్తు న్నదో! నీ మీద మాకు ఎటువంటి హక్కు లేదట. తనకే నీమీద అధికారం వుందిట!

కమ ; ఏమిటామాటలు రోహిణి! నీకు మతి పోయింది. లోకం అంతా కట్నాలు యిస్తుంది. మీ నాన్న కూడా యిచ్చారు! మేము తీసుకున్నాం. అంతే.

సుంద ; మేమే మన్నా బలవంతం పెట్టామా మీ నాన్నని?- నిన్ను కాకపోతే యింకో పిల్లను పెళ్ళి చేసే వాళ్ళం

మా అబ్బాయికి! మీ నాన్న కాళ్ళా వేళ్ళాబడితే
ముప్ఫయివేల కట్నానికి ఒప్పుకుని నిన్ను కోడలిగా
చేసుకున్నాం!

రోహి ; ముప్ఫయివేలు కట్నం యివ్వడానికి మా నాన్నగారు
యెంత కష్టపడ్డారో మీకేం తెలుసు?

సుంద ; ఏం కష్టపడ్డారమ్మా?

రోహి ; నా పెళ్ళి చేయడం కోసం—మా నాన్న - తాతలు సంపా
దించిన రెండు ఎకరాల పొలం పదివేలకు అమ్మ వలసి
వచ్చింది. తన ఉద్యోగ కాలమంతా పొదుపు చేసిన
యిన్స్యూరెన్సు పట్టా పదివేలకు అమ్ముకోవలసి వచ్చింది
మా అమ్మ పుట్టింటి వారిచ్చిన నగలన్నీ అమ్మి మీకు
కట్నమిచ్చి నాకు పెళ్ళి చేయవలసి వచ్చింది?

సుంద ; ఈ విధంగా మమ్మల్ని రద్ది పెట్టకపోతే కట్నంలేని
మొగుణ్ణి పెళ్ళి చేసుకోలేకపోయావా?

రోహి : ఈ పెళ్ళికి మీ అబ్బాయే కారణం! లేకపోతే కట్నం
లేని మొగుణ్ణే పెళ్ళి చేసుకునేదాన్ని!

సుంద ; మా అబ్బాయి యేం చేశాడు?

రోహి ; నేను మీ అబ్బాయికి నచ్చానని, తక్కువ కట్నంతో
పెళ్ళి చేసుకుంటాననీ, మా నాన్నగారికి వాగ్దానం
చేశారు!

సుంద ; ఏరా కమలం? ఈ మాటలు నిజమేనా? తక్కువ
కట్నంతో పెళ్ళి చేసుకుంటానని వాళ్ళ నాన్న దగ్గర
వాగ్దానం చేశావా?

కమ ; నిజమేనమ్మా! చదువుకున్న పిల్లనీ, అందమైన అమ్మాయి అనీ మీతో మాట్లాడి తక్కువ కట్నంతో పెళ్ళి చేసుకుంటానని చెప్పాను! కాని నా మాటలు మీరు వినలేదుగా!

సుంద ; నీ ముందే గదరా! అబ్బాయి ఆలునూరు ఆదిశేషయ్య గారు సలభై వేలు కట్నం యిస్తామంటే-నీ మాటమీద ముప్పయి వేలకి అంగీకరించాం!

రోహి ; మీకు ముప్పయి వేలంటే తేలిగ్గావుంది. నా పెళ్ళి చేసి నా పుట్టింటివారు ఎన్ని కష్టాలు పడుతున్నారో మీకేం తెలుసు?

సుంద ; ఏం కష్టపడుతున్నారమ్మా?

రోహి ; ఏం కష్ట పడుతున్నారో వెళ్ళి చూస్తే తెలుస్తుంది! మా నాన్నకు వచ్చే నెలసరి పింఛను 200 రూపాయలతో ఇల్లు గడుస్తూవుంది! ఇల్లు తప్ప యితరమైన ఏ ఆధారం లేదు. పెళ్ళికాని చెల్లెలు! మా చెల్లెల్ని తలుచుకుంటే నాకెంతో బాధగలుగుతుందో మీకేం తెలుసు

సుంద ; మీ చెల్లెల్ని గూడ మావాణ్ణే పెళ్ళి చేసుకోమంటావా? ఏం? ఆ మాటకూడా చెప్పు!

రోహి ; మీ అబ్బాయిని పెళ్ళి చేసుకున్నందుకు నేనే పశ్చాత్తాపం పడుతున్నాను.

సుంద ; అయితే మా వాణ్ణి వదిలిపెట్టి మరొకర్ని చేసుకోరాదూ!

కమ ; అమ్మా! ఏమిటమాటలే అవి? మీ రిద్దరు పోట్లాడు

కుంటూ సన్ను ఆఫీసుకు వెళ్ళనివ్వరా యేమిటి? వంట చేస్తారా? లేకపోతే హోటల్లో తినమంటారా?

రోహి ; మీ అబ్బాయిని అట్లాగే వదిలిపెట్టి పోతాను! మీ కిచ్చిన ముప్ఫయివేలకట్నం యిలా పారెయ్యండి!

సుంద ; అట్లాగేపారేస్తాం! వెళ్ళుతల్లీ! సత్యభామను ఆలునూలు వారి సంబంధం అట్లాగే వుంది! ఆపిల్లను చేసుకుంటాం.

కమ ; అమ్మా! ముందు నువ్వు వంటింట్లోకి వెళ్ళి పొయ్యి రాజెయ్యి! ఆకలవుతోంది.

సుంద ; ఒరేయ్! కమలం. నీ పెళ్ళాన్ని వంట చేయమని చెప్ప లేవట్రా?

రోహి ; ఇవ్వాళ నేను వంట చెయ్యలేను! తల నొప్పిగావుంది కావలిస్తే మీరే చేసుకోండి! లేదా పస్తు పడుకోండి! ఇప్పుడేగా మీరు చెప్పారు - కట్నం పారేస్తాం! ఇంట్లో నుంచి వెళ్ళిపొమ్మని!

సుంద ; అన్నిటికీ తెగించిన నీతో యెవరు మాట్లాడతారు తల్లీ! నీకు తప్పితే నాకు తప్పుతుందా వంట! ఒసేవ్! లచ్చీ ఆ తోమిన గిన్నెలు యిలా తీసుకురా.

(సుందరమ్మ వంటింటిలోనికి నిష్క్రమించును)

కమ ; రోహిణీ! ఇట్లా అయితే మన కాపురం యెట్లా నడుస్తుంది చెప్పు? పెద్దవాళ్ళకి యేవో పట్టుదలలు, చాదస్తాలు వుంటూ వుంటాయి! వాళ్ళతో వాదిస్తూ కూచుంటే బండి యెలా నడుస్తుంది. చెప్పు?

రోహి ; చూడండి! నేను ఇక్కడ వున్నానుగాని నా మన సంతా పుట్టింటిమీదే వుంది! నా పెళ్ళివలన మా

కుటుంబానికి యిన్ని కష్టాలువచ్చినవో ఆలోచించండి! మా చెల్లెల్ని దలుచుకుంటే—నాకు దుఃఖం పొర్లుకొని వస్తున్నది! దాని పెళ్ళి యెట్లా అవుతుందా అని!

కమ ; చూడు! రోహిణీ! ఈ విషయం మా నాన్న గారితో మాట్లాడాను!

రోహిం ; ఏ విషయం?

కమ ; మీ చెల్లెలి పెళ్ళి విషయం!

రోహిం ; వారేమన్నారు?

కమలాకర్ : మీ చెల్లెల్ని మాచిన్నాన్న కొడుకుసుధాకర్ కిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు!

రోహిణి : సుధాకర్ మాత్రం కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటాడా?

కమలాకర్ : మీనాన్న నాకిచ్చిన ముప్పయివేలు అతనికిచ్చి మీ చెల్లెలి పెళ్ళిచేస్తానన్నాడు!

రోహిణి : మీనాన్నగారు అంతటి త్యాగానికి సిద్ధపడతారంటారా?

కమలాకర్ : మానాన్నగారే స్వయంగా చెప్పారు!

రోహిణి ; సుధాకర్ ముప్పయివేలకి అంగీకరిస్తాడా?

కమలాకర్ : సుధాకర్ మానాన్న మాటకాదనడు! మానాన్న మీద అతనికెంతో గౌరవం! స్టేటు బ్యాంకులో అతనికి ఉద్యోగం!

రోహిణి ; ఏమో! ఏం ఉద్యోగమో! ఆడదై పుట్టడమే దురదృష్టమనుకుంటున్నాను. ఈకట్నాల పిశాచాన్ని మొట్టి

మొదట యెవరు లేవదీశారో యేమో వారిని నిలువునా చిత్రవధ చెయ్యాలనిపిస్తున్నది!

కమలాకర్ : ఎవరినీ చిత్రవధ చెయ్యనవసరంలేదు! సంఘంలో తరతరాలనుండివస్తున్న ఒక సాంఘికదురాచారం! ఒక నాటికి ఈ సంఘు దురాచారం తప్పకుండా అంతమవుతుంది! సరేగాని యీ విషయం మా అమ్మతో చెప్పకు ?

రోహిణి ; ఎందుకని ?

కమలాకర్ ; అమ్మతో చెబితే మనప్లానంతా భగ్నమవుతుంది! నాన్నే ఆకట్నమిచ్చి మీనాన్నయిచ్చినట్లుగా నాటక మాడదలుచుకున్నాడు!

రోహిణి ; మీరెంత మంచివారండీ! మీ నాన్నగారు కూడ హృదయంవున్న మనిషి!

కమలాకర్ ; మా అమ్మకూడ మంచిదే! ఇరకా నువ్వు అర్థం చేసుకోలేదు! ఈవిషయమంతా బయటకి పొక్కనివ్వ కుండ సున్నితంగా వ్యవహారం నడిపించాలి!

రోహిణి ; ఈ విషయంలో మీరు చెప్పినట్లుగా వింటాను నా చెల్లెలి పెళ్ళికావడం ముఖ్యం!

(రాఘువయ్య ప్రవేశించును)

రాఘవయ్య : అమ్మాయ్! రోహిణి! ఒరేయ్ కమలాకరం! మీటో యిద్దఱు మాట్లాడు కుంటున్నారు! ఇంట్లో గాలివాన ఆగిపోయిందా!

కమలాకర్ ; గాలివాన లేదు! ఏమి లేదు నాన్నా! వడ్లగింజలో బియ్యపుగింజ! ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకోలేకపోవడం, ఓర్పు లేకపోవడంవల్లనే గృహ జీవితంలో యిటువంటి గాలివానలు వస్తూవుంటవి!

రాఘువయ్య : మీరిద్దరూ ఏదో మాట్లాడుకుంటున్నారు ?

కమలాకర్ ; ఏమీలేదు నాన్నా! యిన్న మీరు చెప్పినమాటతే రోహిణితో చెబుతున్నా! చెల్లెలి పెళ్ళి విషయంలో బెంగపడవద్దనీ, నాన్నగారు అంతా చక్కదిద్దుతారనీ చెబుతున్నాను!

రాఘు : ఈ విషయం మీ అమ్మకు తెలియకూడదని కూడా చెప్పావా ?

కమలాకర్ ; చెప్పాను నాన్నా! ఈ విషయంలో జాగ్రత్తగా వ్యవహరించమని !

రాఘు : ఇదిగో నమ్మా! రోహిణీ! మువ్వయి వేలరూపాయల స్టేటు బ్యాంకు చెక్కు! మీ నాన్నకు అందజేస్తాను! మనసుధాకర్ కిచ్చి మీ చెల్లెలి పెళ్ళి చేద్దాం! లేదా యింకెవరికైనా యిచ్చి మీ చెల్లెలి పెళ్ళి చెయ్యమని మీనాన్నతో చెబుతాను!

రోహిణి ; మీరెంత మంచివారండీ మామయ్యా!

రాఘు : నీపెళ్ళికి అంతకట్నం తీసుకోవాలని నాకు లేదు! కాని మీ అత్తయ్యపోరు - లోకాచారం - పరిస్థితుల ప్రభావంవల్ల అలా పట్టుబట్టి - ముప్పయి వేల రూపాయలు

కట్నం తీసుకోవలసివచ్చింది! ఇందుకు నేనెంతో పశ్చాత్తాపం చెందుతున్నానుః మానవుడికిసుఖాన్నియిచ్చేది ధనం కాదమ్మాయ్! ధనంకాదు! మానవత్వం! మానవత్వం. నిజానికి యీనాడు కట్నం అనేది ఆడపిల్లల పాలిట పిశాచం. అశనిపాతం.

రోహిణీ : మామయ్యా! లోకంలోయీసత్యాన్ని గ్రహించేది యెంతమంది?

రాఘు : సరేగాని వంటింట్లోకి వెళ్లి అత్తయ్యకు సాయం చెయ్యి. అబ్బాయి ఆఫీసుకు వెళ్ళే వేళయింది.

రోహిణి : అట్లాగే మామయ్యా. ఈరోజుమండి అత్తయ్యతో పోట్లాడను. ఒకవేళ అత్తయ్య యేమన్నా అన్నా ఓర్పుతో సహిస్తాను. మీలాంటి మానవత్వం, హృదయం వున్న మామగారు, భర్తవుండగా నాకేం తక్కువ ?

కమలాకర్ : రోహిణీ, అమ్మకూడ మంచిదే. నువ్వు ఇంకా సరిగా అర్థం చేసుకోలేదు.

రోహిణి : అత్తయ్యా! అత్తయ్యా! (లోపలికిపోవును)

[ తెర బడు ను ]



స మా ప్త ము.



ప్రతులకు:

**ఏ. దుర్గారావు. యం.ఓ.యల్.,**

చెరుకుపల్లి పోష్టు,

మిర్యాలగూడ తాలూకా,

నల్లగొండ జిల్లా.

